అమ్మ ఇచ్చిన

# సౌభాగ్యభాగ్యము



కొండపాటూరి బాల

T/18

# ప్రేరణ

చేయుదానవీవు చేయించునది నీవు
చేయుశక్తి వీవు చేత నీవు
సర్వసాక్షి వీవు సర్వంబు నీవెలే
విశ్వజనని వౌచు వేలసినావు

అమ్మ ప్రేరణే నా యీగ్రంధానికి పునాది. రామకృష్ణ పరమహంస వివేకానందునకు సత్యసాక్షాత్కారం గావించిన సన్నివేశం నా మనస్సుకు హత్తుకున్నది. పరమహంస ప్రసాదించిన మంత్రోపదేశంతో సాధనాబలంతో జీవబ్రహ్మైను సంధాన్ని సాధించి ఆ ఆనందరసానుభూతిని కొంత కాలం అనుభవించి గురువు వద్దకువచ్చి ఈ జన్మకిదిచాలు స్వామి! అని తృప్తితో చెప్పాడుట. అందుకు పరమహంస నీవింత స్వార్ధ పరుడవనుకో లేదు నాయనా! వృక్షం ఊడలుదిగి ఎందరో జీవరాసులకు నీడనిచ్చి సేదతీరుస్తున్నట్లుగా మానవజాతికి జీవన్ముక్తి సాధనా మార్గదర్శివై జ్ఞానబోధచేసి తరింపచేస్తా వనుకున్నాను అని బాధపడ్డాడు. అప్పుడు ఆ కర్తవ్యబోధతో ఉత్తేజితుడైన వివేకానందుడు ధర్మ జాగృత శంఖారావాన్ని పూరించి భారతీయ సంస్కృతిని, ధర్మాన్ని ప్రపంచంలో నేలనాలుగు చెరగులా వెదజల్లి ఒక ప్రవక్తగా నిలచాడు. ఎన్నో సంస్థలు స్థాపించాడు. భౌతిక ఆధ్యాత్మిక సేవా మార్గంలో మానవజాతికే మార్గదర్శకుడైనాడు. శాశ్వత కీర్తి వంతుడైనాడు.

అమ్మ నాకు పునర్జన్మను ప్రసాదించింది. నాకు తృప్తి నిచ్చింది. అయితే నేను తృప్తి పడటమేకాదు. నా అనుభవానికి గుర్తుగా లోకానికి చాటిచెప్పాలని పించింది. అమ్మ చూపించిన బాటలో లోకానికి వెలుగు ప్రసరింపచేయాలనిపించింది. అమ్మ ఆశయానికి సార్ధకత కలిగించాలనిపించింది. నా జీవన నౌకను అమ్మ చూపించిన చుక్కాని నలుగురిముందుంచాలని పించింది.

బాల్యంలో అమ్మతో ఆడుకున్నాను. పాడుకున్నాను. మళ్ళీ చాల సంవత్సరాల తర్వాత నా చిన్నానాటి స్నేహితురాలు అనసూయ లోక హితురాలై దేవతయై సాక్షాత్కరించింది. ఆ ఆనందంతో 1974 లో "ఆత్మనివేదన" అన్న పేరుతో అమ్మపై భక్తి గీతాలు ఆలపించాను. 1999 లో అమ్మ నా కిచ్చిన అనుభవాలను "మధురానుభూతులు" పేర ఒక గ్రంధాన్ని సమర్పించాను.

ఈనాడు నాకు పునర్జన్మ ఇచ్చింది. ఈ మహాప్రస్థానదశలో "అమ్మ ఇచ్చిన సౌభాగ్య భాగ్యం" గ్రంధాన్ని లోకానికి అందిస్తున్నాను. ఇది స్త్రీ జాతికి జాగృత శంఖారావం కావాలి. ఆ అదృష్టాన్ని అమ్మ అనుగ్రహిస్తుంది. అమ్మకరుణామయి కదా!

ఈ గ్రంధ ముద్రణ విషయంలో, ఈ గ్రంధమనే ఏమిటి? నా అన్ని గ్రంధాల ప్రచురణలోనూ సోదరుడు పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ సాయం మరువరానిది. అతనికి అమ్మ అనుగ్రహం సంపూర్ణంగా ఉండాలనీ పుత్ర పౌత్రాభివృద్ధిగా వర్ధిల్లాలని అమ్మను మనసారా ప్రార్ధిస్తున్నాను.

ఇక గ్రంధాన్ని గూర్చి నేనేంచెప్పేది. పేజీ త్రిప్పండి. చదవండి అమ్మ ఆశయాన్ని అమలు పరచండి ఇది నా కోరిక నా ఆశయం నా ప్రార్ధన.

అమ్మ ప్రేమ కందిన పసికందు

***కొండపాటూరి బాల***

# అంకితం

తెలిసి తెలియనట్టి లలిత వయస్సులో
పెళ్ళి చేసినారు పెద్దవారు
తల్లిదండ్రులిడిన తర్ఫీదుతో నేను
భర్త సుఖము కొరకె పాటుపడితి

కష్టసుఖములందు కలసిమెలసి యుండి
ఒక్కమాట మీద ఒక్కబాట
మీద నడచినాము - మేనులు వేరైన
మనసులొక్కటగుచు మసలినాము

అరువదేండ్లపైన ఆయనతో నేను
అర్ధ భాగమగుచు అలరినాను
చరమదశను తాను చనె ముందు నన్వీడి
శాశ్వతుండె హృదయ సదన మందు

పతియె దేవుడనుచు భావించి పూజించి
వంశవృద్ధి చేసి వరలినాను
సాధుమూర్తి నాదు "సౌభాగ్యభాగ్యము"
అంకితమ్ముచేతు అంజలించి.

నాలో మా శ్రీవారు, మా శ్రీవారిలో నేను ఒదిగిపోయి ఉన్నాం. దేహం విడిచినా నన్ను వీడని శ్రీవారికి శ్రీ కొండపాటూరి వెంకట లక్ష్మీ నరసింహారాయ మహోదయులకు ఈ గ్రంధం అంకితం

బాల

# అమ్మ అమృత ధార

అవి జిల్లెళ్ళమూడి అమ్మ అమృతోత్సవములు కన్నుల పండుగగా జరిగి ఆనందంగా అలరింప చేసిన సందర్భము. ఈ ఆనందాన్ని అందరికి పంచాలని వుంది.

అమ్మ ఆలయ ప్రతిష్ఠ జరిగి ద్వాదశవత్సరములు గడిచాయి. మళ్ళీ ఆ ఆలయం పూర్వ వైభవం సంతరించుకుంది. ఆలయ ఆవరణ రంగు రంగుల షామ్యానాలతో అలంకరింప బడింది. సువాసినులు ఎర్రంచు పసుపురంగు చీరలు ధరించి తిరిగుతూ ఉంటే కదంబవనవాసినులే అన్నట్లున్నది. వారు ధరించిన ఆ ఎర్రపచ్చమందారాల, కుసుమసౌరభాలు ఒయ్యారంగా అటు ఇటు కదలుతున్న అందాల భామల, అందెల రవళులు, ఘల్లు ఘల్లున వినబడినట్లుగా, అమ్మ హైమ హంసయానలై నడయాడినట్లు ఏదో తెలియని ఆనంద డోలికలలో మనసు ఊగిసలాడిన భావన. ఆ దృశ్యము, ఇంటికి వచ్చాక కూడ కనులలో కదలాడుతున్నట్లే ఉంది. ఆ మూడు రోజులు రోజుకి 21 సార్లు లలితా సహస్రనామ పారాయణ చేశాను. అక్కయ్యలు, అన్నయ్యలు కలిసి బారులు తీరి పూజలు చేస్తుంటే ఎంతో కనుల పండుగ అయింది. ఆ ఆనందంతో అమ్మ మూడువ రోజు మధ్యాహ్నం, తన కరుణామృత వృష్టి మనపై కురిసినది. మనం పూజ చేస్తూనే వున్నాము. అమ్మ దయ అమృత ధారగా కురిసింది. మనసు ఆ అమృత తరంగాలలో తేలియాడినది ఆనాడు కురిసిన వర్షం యిబ్బంది అనిపించలేదు సరికదా అమ్మ కృపారసవర్షం అని పించింది. ఆ క్షణాలు మరువరానివి. మూడువ రోజు సాయంకాలానికి, కుంకుమను రాశిగా అమ్మ ముందు పోసారు. శంఖ చక్ర కిరీట శూల ధారిణి అయిన అమ్మ చిదగ్ని కుండ సంభూతగా, భాసించింది. చండ, ముండ, భండాసుర, రాక్షసులను సంహరించి, రుధిరస్నాతయై భాసిల్లిన శ్రీదేవిని ఒళ్ళంతా కళ్ళుచేసుకొని చూసిన ఆనందము, హాయి, తృప్తి కుంకుమ రాశిలో అమ్మను చూసినపుడు కలిగాయి. ఆ రాక్షస సంహారం చేసిన మూర్తిని అక్కడ మనం వుండి చూసామా అనిపించింది. ఎంతో సేపటికి గాని నేను మామూలు స్థితికి రాలేక పోయాను. ఆక్షణాలు మరపురానివి. నన్ను ఎంతో పరవశింప చేసినవి. ఇంటికి వచ్చాక ఎన్నోసార్లు మా వాళ్ళకు ఆ అద్భుతదృశ్యం వర్ణించి చెప్పాను. నా ఆనందాన్ని నా సంతోషాన్ని పది మందితో కలసి పంచు కోవడంలో ఎంతో సంతృప్తి దాగివుంది అందరితో పంచుకోవడానికి మాసపత్రికలే మాధ్యమం. మాతృశ్రీ మళ్ళీ విశ్వజననిగా ఆవిర్భవించింది. ఇంతకన్నా అమ్మ కరుణకు తార్కాణం ఏముంటుంది? ఇలా అమ్మ కరుణ మనపై అమృత ధారగా కురుస్తూనే వున్నది.

# స్త్రీ నిత్య సుమంగళి

కలియుగంలో కల్కి (కలికి) అనే పేరుకు అర్థం 'స్త్రీ'. ఆ స్త్రీ మూర్తియే జగజ్జనని, విశ్వజనని అమ్మ. ఆమె కరుణామృత వర్షిణి. తన ప్రేమ, వాత్సల్యం సమస్త జీవరాసులకు పంచి ప్రేమామృతవాహినిలో తృప్తులను చేసి తరింప చేస్తున్నది. "నాకు శిష్యులు లేరు శిశువులే" అని ఘంటా పథంగా చాటి చెప్పిన అమృతమూర్తి అమ్మ. తన బిడ్డలకు భోజన వసతులు, చదువుకోను విద్యాలయం, వైద్యానికి వైద్యాలయం జాతిమత భేదాలు లేకుండా సౌభ్రాతృత్వంతో కలిసి మెలసి మెలిగేలా ప్రేమవాహిని ప్రవహింప చేసి ఐక్యతతో మెలిగే సహనం యిచ్చింది. సమాధిస్థితిలోఉన్నా అందరికీ యోగ క్షేమాలను అందించే అమృత భాండము అమ్మ. ఇది అందరిల్లూ, ఆదరణాలయం అని సర్వసమైక్యత చాటిన అమృత మూర్తే అమ్మ.

మహిళామాంగల్యోద్ధరణ: అనే అంశం పై వ్రాయటానికి అమ్మ నాలో ప్రేరణ, కలిగించినది. అమ్మ ఆశయాలలో ఇదొక ముఖ్యాంశం. అమ్మ తను సంకల్పించిన పని మరొకరిచే జరిపిస్తుంది. ఆ అంశాన్ని తను చేయలేక కాదు. రామాయణంలో శ్రీరాముడు పితృవాక్య పరిపాలనచే ధర్మాన్ని నిలబట్టేందుకు అడవులకు పోయి అనేక మంది రాక్షసులను సంహరించటం, సుగ్రీవునితో మైత్రి, వాలి వధ, సముద్ర తరణం, లంకా పురి దహనం, కుంభకర్ణ రావణాది రాక్షస సంహారం అనేక అంశాలు గోచరిస్తాయి. సీతాపహరణం జటాయువు ద్వారా తెలియగానే రామబాణం వేస్తే లంక భస్మీంపటలం అయ్యేదిగా! అలా ఎందుకు చేయలేదు? రామాయణం చదివిన అందరికీ తెలుసు "రామో విగ్రహవాన్ ధర్మః" మూర్తీభవించిన ధర్మ స్వరూపుడు రాముడు. ధర్మ సంస్థాపన కొఱకు వచ్చిన అవతారం కనుక ఇన్ని అంశాలు రామాయణంలో గోచరిస్తాయి. అలానే కృష్ణావతారం. కృష్ణుడు పాండవులను అరణ్యవాసం, అజ్ఞాతవాసం చేయకుండా కష్టాలపాలు కాకుండా కాపాడవచ్చుకదా! కాని ఆయన అలా చేయలేదు. కురుక్షేత్ర సంగ్రామం జరిపించాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మ సంస్థాపన గావించాడు.

అమ్మగా బిడ్డల అవసరాలలో ఒక భాగమైన మాంగల్యోద్ధరణ అనే అంశం కూడ తన నుండే మొదలు కావలెనని గోపాలరావుగారి తండ్రి పోయినపుడు ఆ ఎనభై సంవత్సరాలు పెద్ద ముత్తైదువకు జరిపిన ఆ మంగళకర చిహ్నాలను తొలగించిన

సందర్భం విని చాలా బాధ పడ్డది. "భర్త అంటే భావనే" అని ఆ భావన మనస్సులో ఉన్నంత కాలం స్త్రీతో భర్త ఉన్నట్లేననీ భౌతికంగా భర్త లేక పోయినంత మాత్రాన స్త్రీ ని వికృత రూపిణిగా చేయాల్సిన అవసరం లేదని అమ్మ చెప్పింది. ఈ విషయంలో ఎంతో కాలం నుండి నా మనస్సులో జరిగిన అంతర్మధనం ఈ రచనకు ప్రేరణ ఇచ్చింది. నాలో ఏ అభిప్రాయం కల్గినా అది అమ్మ సంకల్పంగానే భావించి ఆచరిస్తా. "అన్ని నేనులు నేనైన నేను" అన్న అమ్మ వాక్యం ఈ సందర్భంగా గుర్తు చేసుకుంటాను. మనందరం అమ్మ బిడ్డలం. అమ్మ ఆశయాన్ని నెరవేర్చాలి. ఇందుకు అందరం మనసా వాచా కర్మణా ఒకటై ముక్త కంఠంతో అమ్మ ఆజ్ఞని పాటించాలని నా అభ్యర్ధన. సృష్టికి స్త్రీ పురుషుల కలయికే కారణం. మానవులమైన మనం ఈ కలయికని పెళ్ళి పేరుతో ఎంతో వైభవంగా, వేడుకగా జరుపుకుంటాం. మామిడి తోరణాలు, బాజాభజంత్రీలు రంగురంగుల దీపాలంకరణతో మండపం, బంధుమిత్రుల ఆగమనంతో ఆడంబరంగా వివాహక్రతువు జరుపు కుంటాం. మాంగల్యధారణపుడు వరుడు.

శ్లో॥ మాంగల్యం తంతునా నేనా మమజీవన హేతునా
కంఠే భధ్నామి శుభగే జీవంతుశరదాశ్శతం.

అని స్త్రీ మెడలో తొమ్మిది పోగులు వేసిన పసుపు దారంతో ధగధగ మెరిసే మాంగల్యం కడతాడు. ఆ సమయంలో బాజాభజంత్రీలు, మేళతాళాలు, ఆకాశం దద్దరిల్లే లాగా మ్రోగుతాయి. ఆ వేడుక జీవితంలో మరపురాని మధురాతి మధురమైన వేడుకగా నిలిచి పోతుంది. ఆ తర్వాత సంసారం సాగుతూ పిల్లలు పుడతారు. ఆ పిల్లలకు నామకరణ మహోత్సవం జరుగుతుంది. ఆ సమయంలో పురోహితుడు తండ్రి చేత బిడ్డ మాడు మీద అంటే శిరస్సు పై బ్రహ్మరంధ్రం ఉండే చోట చేతిని తాకించి ఇలా మంత్రం చెప్పిస్తారు

శ్లో॥ అంగా, దంగాత్ సంభవసి,
ఆత్మావై, పుత్రనామాసి,
జీవంతు శరదా శ్శతమ్.

దానర్ధం నేనే నీవు. నా ఆత్మ నీవుగా జన్మించావు. మన గోత్రాభివృద్ధి, వంశాభివృద్ధి చెందేటట్లుగా నూరేండ్లు సుఖంగా జీవించి వంశం వృద్ధి చేసి మన పెద్దల పేరు ప్రతిష్ఠలు నిలుపు. అనే భావం చెప్పిస్తారు. సరే! ఆ క్రతువు పూర్తి అవుతుంది. ఆ

తల్లిదండ్రుల జీవితాలు సుఖమయంగా సాగిపోతాయి. చివరి దశలో ఎవరు ముందు ఎవరు వెనకో తెలియదు గదా! ముందు ఆడవాళ్ళే పోతే అదృష్ట వంతులే. లేక మగవాడు పోతే ఆ ఆడవారికి జరిగే శృంగభంగం భరించరానిది. ఆనాడు మాంగల్యబంధంతోనే ఈ బంధా లేర్పడ్డాయి. అత్తమామలు, పిల్లలు, ఆడపడచులు, మరుదులు, అందరి అవసరాలు తీర్చి, అందరి కష్ట సుఖాలలో పాలు పంచుకొని తలలోని నాల్కగా మెలిగిన ఆ స్త్రీ మూర్తి దురదృష్టవశాత్తు తన జీవిత భాగస్వామిని పోగొట్టుకొని బాధాతప్త హృదయంతో ఆవేదనతో ఉండగా ఈ హింసాకాండ ద్వారా ఇంకా ఆవేదన కల్గించుతారెందుకో? అసలు ఆ క్రతువులను నిషేధించాలి. ఆ మాంగల్య బంధంలోనే కదా ఈ బాంధవ్యాలు ఏర్పడ్డాయి. ఆ బంధాలు, ఆ బాంధవ్యాలు అలానే కొనసాగుతున్నప్పుడు వీటి కారణమైన మాంగల్యం ఎందుకు తీసివేయాలి? అమ్మ ఒక సందర్భంలో అన్నది – బిడ్డ పుట్టిన 11వ రోజున పేరు పెడతాము. గాజులు, కాటుక, పూలు ఇవన్నీ పెళ్ళికాకముందు నుండీ ఉన్నవే కదా! అసలు వాటిని ఎందుకు తీసివేయాలి? అవి అన్నీ భర్త రాక ముందే ఉన్నవి. అదీకాక ఆ బంధంతో నూరేండ్లు జీవించమని అన్నారు. ఆ మంగళసూత్రాలు తీసేసినంతమాత్రాన ఆ కుటుంబంతో సంబంధం పోదుకదా? భర్త చనిపోతే ఆ పిల్లల బాధ్యతలు, అలానే భర్త చేసే ఉద్యోగం చేసే హక్కు కూడ చట్ట రీత్యా భార్యకుంది. అలాంటపుడు ఆ మంగళకరచిహ్నాలను తీయనక్కరలేదు. అసలెందుకు తీయాలి? ఈ అమ్మ మాటల్ని ఆజ్ఞగా భావించి అమలు జరపాలి. మగవాడు ఆడమనిషి పోతే మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడు. స్త్రీ మటుకు ఆపని అంత తొందరగా చేయదు. మగవాడు స్త్రీ ఆపని చేయటానికి నూటికి నూరుపాళ్ళు ఒప్పుకోడు. ఆస్తి పాస్తులు లేకపోతే ఉద్యోగం చేసే అర్హత లేకపోతే కాయకష్టం చేసైనా తనపిల్లల్ని పోషించుకుంటుంది తల్లి. అటువంటి అమృత హృదయం, సహనం కల్గిన ఆడదానికి అలంకారాలను తీసే కార్యక్రమం పూర్తిగా రద్దు చేయాలి. ఆ పదవరోజు అనే మాట తీసివేయాలి. వేదమంత్రాలను కించ పరచవలసిన అవసరం లేదు. శాస్త్రోక్త ప్రకారం మిగిలిన కార్యక్రమం అంతా యధావిధిగా జరిపించి స్త్రీ కి మాత్రం బొట్టు, పూలు, మాంగల్యం, పసుపు, కుంకుమ, కొత్తచీర ఇచ్చి అందరూ బొట్టు పెట్టి అక్షతలు వేసి ఆశీర్వదించితే ఆమె బాధ కొంత ఉపశమిస్తుంది. దాని వల్ల ఏ కీడు రాదని అమ్మ హామీ ఇచ్చింది. ఇది ముమ్మాటికి సత్యం. అమ్మ సర్వానుల్లంఘ్య శాసన.

అమ్మ మాట అవశ్యం అమలు జరపాలి. జాగ్రదావస్థలో అమ్మ దర్శనం అయిన సందర్భంలో ఇది వ్రాస్తున్నా. అమ్మ సర్వాలంకార శోభితయై సింహాసనాధిష్ఠితయై వసిన్యాది వాగ్దేవతలను సహస్ర నామస్తోత్రం గానం చేయమని కనుసైగల ఆదేశించింది. ఆ దృశ్యం చూడటానికి కోటి మంది లక్ష్మీ నారాయణులు, కోటి మంది వాణీ హిరణ్యగర్భులు, కోటి మంది గౌరీశంకరులు, సిద్ధులు, గంధర్వులు, ఎందరో ఆ తల్లి దర్శనం చేసుకుంటున్న సమయంలో అమ్మ నాకు ఈ ప్రేరణ ఇచ్చింది. ఇది మరపురాని సన్నివేశం. అమ్మ అనుగ్రహం అమ్మ మామూలుగా నిత్య జీవితంలో దేహధారిణిగా ఉండి నేను వచ్చే రోజులలో కను సైగలతోనే నేనాశించే దానికి జావాబిచ్చేది. ముఖాముఖి మాట్లాడటం తక్కువ. ఆ కనుసైగలతోనే నాకు ఆత్మ తృప్తి కలిగించింది. మౌనరాగంతో ఆమె కళ్ళలో నుండి ఒక కాంతి నా కనులకు మాటలుగా వినిపించింది. అమ్మ సమాధి స్థితయై నా గుండెల నిండా కొలువుంది. అమ్మ అనురాగమయి. స్త్రీ ని వితంతువు అంటే అమ్మ ఒప్పుకోదు. ఆ మాట స్థానంలో స్వతంత్రురాలు అని చేర్చాలి. వైధవ్యము అనే మాట కొట్టి వేయాలి. ఆ స్థానంలో వైకల్యం లేనిది అని అంటే బాగుంటుంది ఆమెకు బొట్టు పెట్టుట ఆమె చేత బొట్టు పెట్టించుట చేస్తే వికలత్వం చెందకుండా ఉంటుంది. అలాచేయకపోతే నన్ను పనికి రాని దానిలాగా చూస్తున్నారు అని వికలత్వం చెంది కృశించిపోతుంది. ఆ వైకల్యం లేకుండా మనిషిని మనిషిగా ధైర్యం వచ్చేలా చేయాలి. ఎంతో ఆదరాభిమానాలు చూపాలి. ఓదార్పు, ఊరట కలిగించి నలుగురిలో తిరిగేలా చేయాలి. గాని మూలకూర్చో బెట్టి బాధించకూడదు. అమ్మ విడాకులు తీసుకున్న వాళ్ళు కూడ మాంగల్యం తీయటానికి ఒప్పుకోదు.

ఒక వేళ చిన్నతనం అయితే పెద్దలే మళ్ళీ వివహం చేయవచ్చు. 1936-1938 లలో ఉమామహేశ్వర పండితులు హిందూ ధర్మాన్ని గురించి వేద పౌరాణిక ప్రమాణాలతో ఉపన్యసించేవారు. అప్పుడు నాకు 14, 15 సం॥ లు ఆ ఉపన్యాసాలకు నేను వెళ్ళేదాన్ని. బిడ్డలు లేని వారైతే తప్పక విహాహం చేయ వచ్చుని కొన్ని గ్రంధాలలో ప్రమాణాలు చూపి చెప్పేవారు. కందుకూరి వీరేశలింగంగారు బాల్య వివాహాలు రద్దు చేసి వితంతు వివాహాలను ప్రోత్సహించి పుణ్యం కట్టు కున్నారు కన్యాశుల్కంతో జరిగే వివాహాలను గురజాడ అప్పారావుగారు ఎండగట్టగా, సతీ సహగమననికి వ్యతిరేకంగా రాజా రామ్మోహనరాయ్ గారు ఉద్యమించి స్త్రీ జాతికి ప్రాణ భిక్ష పెట్టారు. మన పూర్వీకులు

మాత్రం మూఢాచారాలతో మనుషులను వయసు నిమిత్తం లేకుండా హింసించేవారు. ఆధ్యాత్మిక విషయాలు అవగాహన అట్టే ఉండేది కాదు. దేహమే నేను అనే భావనతో నిప్పులు కడిగే ఆచారాలతో ఆలోచన తక్కువగా ఉండేది. చిన్న తనంలోనే శిరో ముండనం చేసే వారు జుట్టుతో వంట చేస్తే దేవుడికి పనికి రాదట. బయటకు రాకూడదు. ఉదయం ఎవరికీ కనపడకూడదు. ముసుగు ముఖం మీదకు లాక్కుని తిరుగుతూ చాకిరీ మాత్రం చేయాలి. అలా నీటిలో కప్పలాగా ఆ నాడు కన్యల విధవల జీవితాలు గడిచాయి. తలలు బోడి అయిన తలపులు వీడి పోవుగదా. అదిమి పెదితే ఆవిరి వచ్చినట్లు చాటుగా కొన్ని సంఘటనలు జరుగుతూ ఉండేవి. ఆ రోజుల్లో పెద్ద వాళ్ళు దేవుడి భక్తి ఆధ్యాత్మిక విచారణ ఇలాంటి వాటికన్న ఆచారం ముఖ్యంగా పాటించేవారు. నాకు తొమ్మిదవ సం॥లోనే పెండ్లి కావటంతో ఈ విషయంలో నా ఆత్మకథ కొంత చెప్పాలి.

1923 జూలై 29న గుంటూరులోని కుగ్లర్ హాస్పటల్‌లో నేను పుట్టాను. అప్పటిదాకా మా నాన్నగారు టెంపరరీగా ఉద్యోగం చేస్తున్నారు. నేను పుట్టిన 10 రోజులలో వారికి ఉద్యోగం పర్మినెంటు అయింది. అందువల్ల చాలా ప్రేమానురాగాలతో చూచేవారు. ఇక నా నామకరణం రోజు ఏ పేరు పెట్టాలనేది పెద్ద సమస్య. మా తాతగారు (నాన్న తండ్రి) మంచి సాధనాపరుడు. పంచదశి ఉపదేశం ఉంది. చాలా మంత్ర సాధకుడు. కనుక బాలా త్రిపుర సుందరి అని నామకరణం చేయాలని ఆయన ఉద్దేశ్యం. ఇక మా నాన్నగారు. ఆయన తల్లి పేరు కోటేశ్వరమ్మ. నేను ధనిష్ఠా నక్షత్రంలో పుట్టాను కనుక ధనకోటేశ్వరి అని నామకరణం చేయాలని, ఇక మా అమ్మగారు. ఆమె తల్లి పోయినపుడు ఋతుమతి అయిన వెంటనే నెలతప్పి పుట్టానని ఆమె తల్లి పేరు సౌభాగ్యమ్మని కనుక ఆ పేరు పెట్టాలని. ఇలా ఎవరికి వారు తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. చివరకు అందరూ కలిసి బాలకోటిసౌభాగ్యమ్మ అని నామ కరణం చేశారు. బాల్య దశలో అమ్మతో కలిసి, చిదంబరరావు తాత గారింట్లో ఆడుకోవటం మరచి పోలేని సంఘటన. బాపట్లలో ఉన్నప్పుడు అమ్మ ఎక్కువ దాగుడు మూతలు ఆడాలనేది. దైవాంశ కనుక దాగుడు మూతలే ఆడేది. స్టేషనుకు దగ్గరగా యూనియన్ ఆఫీసుండేది. దానికి దగ్గర ఊడలు దిగిన మఱ్ఱి చెట్టు. అక్కడే మా పినతల్లిగారిల్లు. అక్కడామె బాదంకాయలు కొట్టి అందరికీ ఇచ్చేది. సాయంకాలం అందరం

భావన్నరాయణస్వామి గుడి, దత్తాత్రియుల గుడి, దగ్గర తిరిగేవాళ్ళం. బెండపూడి అక్కిరాజు గారి భార్య దుర్గమ్మత్తయ్య ఇంటి చుట్టూ తిరిగే వాళ్ళం. 8సం॥లు వచ్చేసరికి అన్నపూర్ణ అత్తయ్య ఆరోగ్యం బాగా లేదని పొన్నూరు ప్రదక్షిణాలకు వెళ్ళినపుడు వాళ్ళతో అమ్మ వెళ్ళినట్లు తెలిసింది. ఆ తర్వాత అమ్మను దేవతగా 1962 లో చూడటం జరిగింది. తర్వాత నాకు 9 సం॥రాగానే పెండ్లి చేశారు. పెళ్ళయిన మొదలు ఇక పెద్దరికపు లక్షణాలు. చిన్నప్పుడా రోజుల్లో చాదుబొట్టు పెట్టేవారు. పెళ్ళయ్యాక చాదుతో ఉండకూడదని కుంకుమ పెట్టుకో మనేవారు. చిన్నతనంతో ఎప్పుడైనా మరిచిపోతే మా నాన్న కోప్పడేవారు. ఆ సూత్రాలన్నా, నల్ల పూసలన్నా ఎంతో జాగ్రత్తగా చూసుకునే దాన్ని. రోజూ, కాళ్ళకు పసుపురాసుకోవటం, మరచి పోకుండా బొట్టు పెట్టు కోవటం చేసేదాన్ని. నోములు వ్రతాలు మా అమ్మ చాలా చేయించింది. చిట్టి బొట్టు, అలంకారం, గాజుల గౌరివ్రతం ఉదయకుంకుమ, శ్రావణ మంగళవారం ఇలా ఎన్నో. మడికట్టడం పూజలు ఇవన్ని అలవాటయ్యాయి. ఎంతో శ్రద్ధా భక్తులతో చేసుకునే దాన్ని. నాకు 11 సం॥ రాగానే ఓణీలు ఇచ్చి స్కూలు మాన్పించారు. 13 నిండి 14 రాగానే గుంటూరు లో కాపురం ఏర్పడ్డది. 15 వచ్చింది మొదలు సహస్రనామ పారాయణ, శుక్రవారం ప్రత్యేకంగా పూజ చేసుకునే దాన్ని. 1940 లో సంతానం మొదలు. మొదటి పిల్ల 2వ సం॥లో ఉండగా మా శ్రీవారికి టైఫాయిడ్ వచ్చింది. వాడపల్లి వెంకటేశ్వరరావు మా ఫామిలీ డాక్టరు. జ్వరం వచ్చి 21 రోజులైనా జ్వరం తగ్గలేదు. మా వారికి మందు మార్చటం, డాక్టరుని మార్చటం ఇష్టం లేదు. ఆయనే ఇంకో డాక్టరుకి చూపించుకోమన్నారు. వెంకటేశ్వరరావు గురువు గారు డాక్టర్ ఆమంచర్ల చలపతిరావు గారిని తెచ్చి చూపించితే ఆయన మందు మార్చి ఆయుర్వేదంలో తీసుకోమన్నారు. అప్పుడే కొత్తగా క్యూరో మైసిన్ క్యాప్సూల్స్ వచ్చాయి. కోర్సుగా వాడాము. ఇంకా హోమియోలో కూడ వాడినా ప్రయోజనం కనబడలేదు. 40 రోజులకు టెంపరేచర్ జారటం మొదలు పెట్టింది. లేవడం కూడా కష్టంగానే ఉంది. నేను చిన్నదాన్ని పెద్ద దిక్కులేదు. ఇన్సూర్ చేసిన ఎమౌంట్ ఏదో ఉంటే ఆఫీసువారిని పిలిచి నా పేరున వ్రాయించారు. ఇదంతా చూస్తుంటే చెప్పలేని ఆవేదన, దుఃఖం పొంగి పొరలింది. పొత్తూరి వెంకటేశ్వరరావు తండ్రిగారు మాకు బంధువు. మా ఇంటి ప్రక్కన ఆయన అన్నగారి ఇల్లు ఉంటే వచ్చారు. మా వారికి ఎలా ఉందో తెలుసుకోటానికి వచ్చారు. వరసకు అన్నయ్య అవుతారు. ఆయనతో

డాక్టరుగారే వైద్యం మార్చమన్నారు ఏం చేయాలో తోచటం లేదు అని బాధ పడితే ఆయనకు తెలిసిన ఆయుర్వేద డాక్టరు ఆంజనేయ ఆచారి ఉన్నాడని బాగా ఇస్తాడని చెప్పి, ఆయన్ని తెచ్చి సాయం కాలం చూపిస్తానని వెళ్ళారు. ఆ పగలు నేను స్నాం చేసి, దీపారాధన చేసి కలియుగ ప్రత్యక్ష దైవము వేంకటేశ్వరస్వామికి ముడుపుకట్టి నా కుడి చేతితోనే డిబ్బెనలో రూకలు వేసే వరకు ఎడమ చేతితో భోజనం చేస్తానని, ఐదు బజార్లు తిరిపెము అంటే భిక్ష ఎత్తుకుని దర్శనానికి వస్తానని మ్రొక్కుకున్నాను. వైద్యము కూడా ఆ రోజు మార్పు చేయాలనుకున్నాము. సాయంకాలం డాక్టరును తెచ్చి చూపించారు. ఆ డాక్టరు మినపగింజ సైజు 4 మాత్రలు ఇచ్చి ఆరాత్రి, మరునాడు మూడు పూటల వేయమని మరునాడు సాయంత్రం వచ్చి చూస్తానని చెప్పి వెళ్ళాడు. ఆ రాత్రికి మందు వేసుకున్నారు. మరునాడు ఉదయం' 10గం॥ ల నుండి టెంపరేచరు, 103 దాకా వెళ్ళేది అలా వెళ్ళకుండా 100లో ఆగింది. సాయంకాలం ఆయన చూచి ఆ మందే పని చేసిందని మళ్ళీ మూడు రోజులకు ఇచ్చి వెళ్ళారు. మూడు రోజులయ్యే సరికి నార్మల్‌కు వచ్చింది. పత్యం పెట్టాము. నెలరోజులలో మామూలు మనిషి అయినారు. ఆ ముడుపు కట్టిన రోజు నాకు మనసు మనసులో లేదు. ఈ మనిషికి తగ్గి స్వామిని దర్శనం చేసుకునే యోగం ఉందా లేదా? నా జీవితం సమాప్తం చేసుకోమంటావా అని కన్నీటి ధారలతో వేడుకున్నాను. భోజనం చేయలేదు. ఆయన తినలేదేమని అడిగారు. తినాలనిలేదు అన్నాను. పడుకున్నాక కలలో తెల్లవారు ఝామున నేను కొండెక్కి పిల్లను ఎత్తుకొని వెళ్తున్నాను "ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమో నమః" అని స్మరించు కుంటూ సగం దూరం పోయేసరికి శోషవచ్చి పడిపోయాను. అక్కడ తిరుమలలో రోజూ స్వామిని వసంత మండపం నుంచి ఊరేగింపుగా వైఖానస ఆశ్రమం ఉండే వీధులలో నుండి వరాహస్వామి గుడి ప్రక్క నుండి తీసుకొస్తారు. ఆ రోజుల్లో అలా చేసే వారట. ఆ ఊరేగింపులో పల్లకీలో స్వామి, పల్లకీ వెంట బాజాభజంత్రీలు అర్చక స్వాములు ఉన్నారు. ఇంతలో నేను క్రింద పడగా నా భక్తురాలు పడిపోయింది అనే మాట నా చెవులకు వినిపించింది. స్వామి నన్ను లేవనెత్తారు. ఆ స్వామిని అంతకు ముందెప్పుడూ చూడనే లేదు. ఉత్సవ విగ్రహం చిన్నదిగా ఉంది మూలవిరాట్ నా కళ్ళుముందు ప్రత్యక్షమైంది. నేను రెండు చేతులు పైకెత్తి నమస్కారం చేస్తూ నా మీద ఎంతదయ ఉంది స్వామీ అంటూ శ్లోకం చదివాను-

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృధ్యాన గమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథం

ఆ దర్శనం ఎన్నోరోజులు కనులు మూసినా నీవాయె కనులు తెరచినా నీవేనాయె అనట్లు నా స్మృతి పథంలో నిలచింది ఆనందంతో కొండంత ధైర్యం వచ్చింది. మరుసటిరోజు నుండి ఆయనకు తగ్గింది. ఆ మ్రొక్కును నల్గురు పిల్లలు పుట్టాక 1947 అక్టోబర్ 5న మా పెద్దవాడికి పుట్టువెంట్రుకలు తీసేందుకుగా వెళ్ళి ఆ మ్రొక్కు తీర్చుకున్నాను. దేనికైనా దైవ సంకల్పం, తరుణం రావాలిగా. పతిభిక్ష పెట్టినందుకు ఐదు బజార్లు ముష్టి తిరిగి వచ్చాము. అప్పటి నుండి జబ్బులు లేకుండా, రాకుండా రోజులు గడచినవి. నా అంతరాత్మలో లలితా సహస్రనామ పారాయణ నిరంతం జరుగుతూనే ఉండేది. 1962 మార్చి 5న అమ్మ దర్శన భాగ్యము కల్గినది. అప్పటి నుండి అమ్మ అనుగ్రహంతో అనేక అనుభూతులు పొందగలిగాను. ఆ మధురానుభూతలను చిన్న పుస్తకరూపంలో వ్రాయగలిగాను. పాటలుగా, పద్యాలుగా అమ్మ నాతో ఎన్నో వ్రాయించింది. నాకు ముగ్గురు ఆడపిల్లలు. అందరి పెళ్ళిళ్ళు శుభకార్యాలు చేశాను. 1971లో మా వారి షష్ఠిపూర్తి, 1993 మే 5 సహస్ర చంద్ర దర్శన విజయోత్సవము జరుపుకున్నారు. 1995 ఆగష్టు 21న అమ్మలో ఆయన కలిసి పోయారు. అమ్మ నిరంతర సాన్నిధ్య భాగ్యం ఆయనకు లభించింది. ఆ రోజన జిల్లెళ్ళమూడి నుండి హనుమబాబు కొడుకు బాబ్జి వచ్చాడు. హఠాత్తుగా వచ్చిన వాడిని చూస్తే అమ్మను చూచినట్లనిపించింది. అప్పటికి వాడు కనిపించి చాలా కాలం అయింది. ఈ రూపంలో అమ్మ ఎందుకు వచ్చింది. అని నాలో ఏదో తెలియని అలజడి రేగింది. ఆరాత్రి 12గం॥ లకు అమ్మ ఆయనను తన లోకానికి తీసుకెళ్ళింది.

ఇక తరువాత కార్యక్రమాలు అయినాయి. వాడు అమ్మ కుంకుమ పొట్లాలు తెచ్చి ఇచ్చాడు. కానీ లోకం కోసం బొట్టు తీయక తప్పలేదు. అమ్మ కుంకుమ పంపినా ధైర్యం చేసి ఉంచుకోలేక పోయాను. నేను మామూలు స్థితికి రావటానికి 2నెలలు పట్టింది. అప్పుడు కుర్తాళస్వామివారు ఇక్కడే గుంటూరులోని ఓంకారక్షేత్రంలో ఉన్నారు. ఆయన దగ్గరకు వెళ్ళి దర్శనం చేసుకొని విషయం మాట్లాడాలని అనుకున్నాను. నా భర్త

పోయిన మూడవ నెలలో అంటే 1995 డిశంబర్ 7 మార్గశిర పౌర్ణమి రాత్రి స్వప్నంలో ముగురమ్మల మూలపుటమ్మ అయిన అమ్మ తన వెంట ఇద్దరు సువాసినీలు రాగా కుంకుమ భరిణ నా చేతుల్లో పెట్టి నీవు బొట్టు పెట్టుకుని మాకు పెట్టమని అన్నది. అమ్మా నీవే నా హృదయాధిష్ఠిత దైవమని నమ్మి ధ్యానించి పూజించి సేవించినందుకు తగిన ఫలం ఇదేనా? తల్లివైన నీవు నాపై ఎందుకు ఇంత కాఠిన్యం వహించావు! పసుపు కుంకుమలతో నిరంతరం నిన్ను పూజించాను కదమ్మా? ఈ కుంకుమ, పసుపు మొదటి నుండి ధరిస్తున్నవేకదా! ఇప్పుడెందుకు వాడకూడదు? అసలు మాంగల్యం ఎందుకు తీయాలి? అలంకారాలను ఎందుకు తొలగించాలి? అని అడిగాను. ఈ ప్రశ్నలు కుర్తాళస్వామిని అడగాలని అంతకుముందు అనుకున్నాను. చింతామణి గృహాంతస్థయైన, సింహాసనారూఢ అయి, అలవైకుంఠ పురములో నగరిలో ఉన్న అమ్మ స్వయంగా నాదగ్గరకు వచ్చి నాకు బొట్టు పెట్టి, నా చేత తనతో వచ్చిన సువాసినులకు బొట్టు పెట్టించి, తను పెట్టించుకొని, నేను నీకు కుంకమ పంపితే ఎందుకు పెట్టుకోలేదు? నీకు అన్నీ ఉంచుకునే అర్హత ఉందని వివరించింది. ఆ విషయం మధురాను భూతులు పుస్తకంలో వ్రాశాను. ఇంతకాలం అయ్యాక మళ్ళీ అన్నీ పెట్టు కుంటే అంతా ఆక్షేపణ చేస్తారేమో అంటే దేవతలకు, పితృదేవతలకు సంవత్సరం ఒక్క రోజుతో సమానం. ఆరు నెలలు కూడా కాలేదు. అంటే సగం రోజు గడచినట్లు. అన్నీ పెట్టుకోమని అమ్మ ఆదేశించినది. మళ్ళీ పునర్జన్మ ఇచ్చి అనుగ్రహించింది.

ముందు తరాల వాళ్ళు మాంగల్యోద్ధరణ దాని అర్థం పూర్తిగా అవగాహన చేసుకోవలెననే కాబోలు "అందరికీసుగతే" అనే అమ్మ కావాలనే నన్ను తన P.A గా చేసుకొని ఈ విషయాల గురించి వివరణ పూర్వకంగా వ్రాయసంకల్పించి వ్రాయించింది. పురుషుడు పురుషుడిగానే ఎలా చలామణి అవుతున్నాడో స్త్రీ కూడా దీర్ఘసుమంగళిగా ఉండే అర్హత దైవ నిర్ణయంగా పటిష్టం చేయాలని అమ్మ ఆశయం. మన పూర్వీకులకు దూరాలోచన తక్కువగా ఉండి, మూఢాచారాలలో ఆడవారి జీవితాలకు అన్యాయం చేశారు. ఈ విషయంలో నాకు చిన్నప్పటి నుండి తీరని బాధగా ఉండేది. అమ్మ నాకు ధైర్యాన్నిచ్చింది. మనో బలాన్నిచ్చింది. అమ్మ దయవల్ల నేను అన్నీ ఉంచుకోగల్గినాను. ఇది చూచి కొందరు సంతోషం వ్యక్తం చేస్తే, మరి కొందరు ఈర్ష్య, ద్వేషాలతో కుచించుకు పోయినారు.

ఇప్పుడు భక్తి మార్గం ద్వారా మనస్సును స్వాధీనం చేసుకొని ఆత్మాను సంధానం చేసుకొని ఆత్మావలోకన, ఆత్మవిచారణ మరియు ధ్యాన యోగ సాధనల ద్వారా కుండలినీ శక్తిని మేల్కొల్పి, సుషుమ్నా నాడి ద్వారా షట్చక్ర భేదన చేసి సహస్రారం చేరి బ్రహ్మానంద స్థితిని అంటే సుధాసారాభివర్షిణి అనే నామార్ధభావ మాధురిని పొంది మరల స్వస్థానం చేరి ఆత్మ సాక్షాత్కారం పొందే జ్ఞానం తెలుసుకొని, ఈ ఆత్మవిచారం జరుపుకొను సులభ మార్గాన్ని ఎందరో తాము అనుభవించి సామాన్యులకు తెలియ చేసేందుకు తమ రచనల ద్వారా అందిస్తున్నారు. అమ్మ మాటలలో "అనుభవమే శాస్త్రాన్ని ఇస్తుంది" అనేది అక్షరసత్యం. ఒక మనిషి పోయాడు అంటే ఆ దేహం ఇంకా అక్కడే ఉంటుంది. ఒకసారి నేను మా అమ్మను అడిగాను - "మనిషి చనిపోయాడు అంటారు" అంటే ఏమిటి? అప్పుడు ఆమె - "ఆయనలో నుండి ఆ హంస వెళ్ళిపోయింది." అని అన్నది. హంస అంటే జీవాత్మ, అదే ప్రాణం. జీవాత్మ, పైకి వెళ్ళి పరమాత్మలో కలుస్తాడు. మా అమ్మ అనేది - "సంసారంలో తామరాకు మీద నీటి బొట్టులాగా ఉండాలి. ఈలోకంలోకి ఎవరు వచ్చినా వారు వాళ్ళపని పూర్తి అయిన వెంటనే ఈలోకం విడిచి వెళ్ళి పోవలసినదే.

ఆడవాళ్ళ పాలిటి శాపం ఈ కర్మకాండ. ఇది చూచి చిన్నప్పుడు చాలా బాధ పడేదాన్ని. నా చిన్నతనం ఒంగోలులో గడచింది. మా ఇల్లు రంగారాయని చెరువు వద్ద. ఆ చెరువు కట్టమీద 10 వ రోజు నాటి కర్మకాండ అంతా జరిపేవారు ఆడవాళ్ళకి. ఆసన్నివేశం ఎంతో బాధ కలిగించేది. ఆ శాపం ఆడవారికి ఎలా పోతుందా అని నేనెంతో ఆవేదన చెందేదాన్ని. ఆకార్యక్రమానికి చరమ గీతం పాడే కాల మాసన్న మయినది. అమ్మదయవల్ల స్త్రీలు ప్రతిఘటించి ఈ విషయంలో అందరూ కలిసి దీన్నొక సవాలుగా స్వీకరించాలి. స్త్రీ జాతికి, మాంగల్యోద్ధరణ జరిగి నూరేండ్లు స్త్రీ శ్రీమతి గానే ఉండాలనే అమ్మ ఆశయాన్ని మనం ఆచరణలో పెట్టాలి, పెండ్లి కాకముందు స్త్రీ కన్యముత్తైదువ, పెళ్ళి అయ్యాక నిండు ముత్తైదువ, వయసు పండితే పెద్దముత్తైదువ, ఇలాంటి పరిస్థితి సంభవిస్తే ఆ మనిషిని పూర్ణ ముత్తైదువ అని పిలుచుట జరగాలి. ఆ స్థితిలో ఆమె అన్నీ తీసేస్తేనే కీడు వస్తుంది గాని అలా ఉంచితే ఏమి దోషం లేదు. నిరభ్యంతరంగా ఆమె అన్న ఉంచుకొని తను బొట్టు పెట్టుకుంటూ, ఇతరులకు బొట్టుపెడుతుంటే ఏ కీడు రాదు. పితృయజ్ఞం జరిగిన తర్వాత ఆశీర్వాదం ఇచ్చేటపుడు పిల్లలతో పాటు ఆమెనూ కూర్చోబెట్టి ఇకనుంచి తల్లీ తండ్రి బాధ్యతలు కూడ

సమర్ధవంతంగా నిర్వహిస్తూ నూరెళ్ళు ధైర్యంగా ఉండేటట్లు దీవించి అక్షతలు వేసి దీర్ఘసుమంగళి అని దీవెనలు అందించితే ఆ మనిషి బాధా విముక్తిచెంది ధైర్యంగా తిరుగుతుంది.

అలా చేసి స్త్రీ జాతిని ఉద్ధరించాలనే అమ్మ సంకల్పం. తల్లి ఆశయం తీర్చటం బిడ్డలుగా మన బాధ్యత. అమ్మ నాకు పునర్జన్మ ఇచ్చింది. "అన్ని నేనులు నేనైన" అమ్మ నా చేత, అంటే ఈ నేను చేత ఈ విషయంలో బాధ నిచ్చి, బాధా విముక్తి చేసి అది బహిర్గతం చేసి దీన్ని ఆచరణ యోగ్యం చేయాలని కాబోలు, ఇది వ్రాసేటట్లు చేసింది. చిన్నప్పటి మా అమ్మానాన్నల మాటలు గుర్తొస్తుంటాయి. వాళ్ళు ఆధ్యాత్మిక భావనలు కలిగించేలా మాట్లాడేవారు. దాన్ని నేను మననం చేసుకుంటూ సారాంశం గ్రహించేదాన్ని. ఇంత కాలానికి నా అనుభవాలను బహిర్గతం చేసే సాహసం కలిగించింది అమ్మ. పెళ్ళిలో పెద్దపులి లేదని పెండ్లి చేసుకొనే సంసారం చేసుకుంటూ ఆ వేదాల సారాన్ని అనుభవం ద్వారా తెలుసుకుంటూ దైవత్వం పొందవచ్చునని నిరూపించిన విశ్వజనని లోకారాధ్యయైన అమ్మ ఆదేశం మేర మన మందరం కలిసి ముందుకు నడవాలి. భర్త పోయినా అన్నీ ఉంచుకోవచ్చునని దాని వల్ల ఏమీ కీడు రాదని దానికి తను బాధ్యత వహించుతానని అమ్మ హామీ ఇచ్చింది. సంసారంలో మనముండాలి గని మనలో సంసారముండ కూడదని అమ్మ సందేశము.

## అమ్మ వెలుగు బాట

చిన్నప్పుడే విహహం అయిన నేను ఆ పుస్తెలు నల్లపూసలు ఎంతో పవిత్ర బంధమని ఆ బంధం ఏడుజన్మల బంధమని పతియే దైవమనే భావనతో జీవితం గడిపాను. భక్తి బాల్యం లాంటిది. యవ్వనంలో గృహస్త ధర్మంలో కూడ నా జీవితం ఆయతో నియమ బద్ధమైన ఆచారలతో సాగిందే గాని భోగాలే ముఖ్యం కాలేదు. ఆయన కూడ ఆధ్యాత్మిక సంపన్నులు. సాధ్యమయ్యేదే సాధన. సంకల్పమే గురువు, దైవము, అని నమ్మి ఎంతో ఉత్తమోత్తమమైన నిష్కామయోగిగా జీవించి నామ స్మరణతో అమ్మ సన్నిధికి చేరారు. అటువంటి వ్యక్తిని భర్తగా పొందటం నా పుణ్యఫలం మనవాళ్ళలోనే కొందరు పురాణ కాలంలో కూడ వైధవ్యానికి విలవనిచ్చారు. దాన్నెలా

కాదంటాం అని అంటారు. ఇప్పటి యువతరం ప్రేమ వివాహాల ద్వారా మతాంతర, కులాంతర వివాహాలు చేసుకుంటే ఏమి కాదంటం లేదు. ప్రేమ అనే పదం పవిత్రమైనది. అలా వివాహం చేసుకున్న వారిని సమాజం చేర దీస్తున్నది. అక్కున చేర్చుకుంటున్నది. ఇది బ్రహ్మంగారి వాక్కు. ఇది అమ్మ ఆశయం. అమ్మ ఆచరణలలో ఇదొక ముఖ్యాంశం. అమ్మ ఆడపిల్లలకు మాంగల్యం కట్టిందని అమ్మ చర్యనే ఆక్షేపించిన అజ్ఞానులున్నారు. అమ్మ దైవత్వం తెలియని మందమతులన్నారు. ఆమె సర్వేశ్వరి. సర్వానుల్లంఘ్యశాసన. అమ్మమాట ముందు తరాలకు వెలుగుబాట కావాలి.

## సర్వసౌభాగ్యదాయిని

అమ్మ దయవల్ల ఆయన లేరనే ఆలోచనేనాకు రావటం లేదు. నిరంతరం నా చుట్టూ తిరుగుతున్నట్లే ఉంటుంది. నిద్రలేచిం దగ్గరనుండి నిద్రపోయేదాకా ఆఖరికి కలలో కూడా ఆయన చింతనే. పూజలో ఎక్కువసేపు కూర్చుంటే ఇంకా ఎంత సేపు పూర్తికాలేదా? అనేవారు. వంట ఆలస్యమైతే నవకాయవంటలు నాలుగు కూరలు చేస్తున్నావా ఏం? అనేవారు. ఎక్కడకో వెళ్ళారనే భావనలేదు. నా మనసులో నిరంతరం అంటి పెట్టుకొని ఉన్నారు. భర్తంటే భావనే అన్న అమ్మమాట సార్థకం చేస్తూ నా భావనలో సంచరిస్తున్నారు. మంగళసూత్రాలు రెండు భర్త పాదాలు అన్న అమ్మమాట ప్రకారం ఆయన పాదాలు నాహృదయ ఫలకంపై చిరస్థాయిగా ఉన్నాయి. భర్త శరీరం వదిలినా భర్త భావాన్ని నేను వదలలేదు. రూపం పరిమితం శక్తి అనంతం కనుక. వారి శక్తి అనంత చైతన్యంలో కలిసి నా చుట్టూ ఆవరించి ఉన్నది. అందువల్ల ఈ భావన ఈ ఆలోచన ఉన్నంత కాలం ఏ స్త్రీ అయినా సౌభాగ్యవతే. భార్యకు భర్తకన్నా భాగ్యమేమున్నది? ఆ భర్త నాతోనే ఉన్నాడు కదా! నేను పేరులోనే కాదు నిత్య సౌభాగ్యవతిని ఇది అమ్మ ఇచ్చిన ప్రసాదం. అమ్మ ఇచ్చిన వరం. నాకే కాదు స్త్రీ జాతి మొత్తానికి వరం. అమ్మ సర్వ సౌభాగ్య ప్రదాయిని కదా!



భర్తతో రచయిత్రి

నా ప్రాణము నా సర్వస్వము అయిన నా భర్త పూజ్యులు
కొండపాటూరి వెంకట లక్ష్మీనరసింహారావు గారికి
ఈ గ్రంథం అంకితం

కొండపాటూరి బాల